ఉదయం ●●●

304615

విజయవాడ
గురువారం
21—11—1974
THE ANDHRAPATRIKA
Regd. H / VJ. No. 49

PUBLISHED SIMULTANEOUSLY FROM MADRAS & VIJAYAWADA

# ఆంధ్రపత్రిక

FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO

సంపుటం : 61
సంచిక : 226
పుటలు : 4
వెల : 25 పైసలు



## వ్యవసాయోత్పత్తి పెంపుదలకు అధిక ప్రాధాన్యం: రాష్ట్రపతి ఉద్బోధ:

### గోదావరిపై రైలు—రోడ్ వంతెనకు ప్రారంభోత్సవం

(ఆంధ్రపత్రిక ప్రత్యేక ప్రతినిధి)

రాజమండ్రి, నవంబరు 20 : వ్యవసాయ రంగం పునాదులు గట్టిపడితేనే పారిశ్రామిక రంగం పటిష్టమవుతుందని రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీఅహ్మద్ నేటి ఉదయం ఇక్కడ గోదావరిపై నిర్మించిన 2.9 కిలోమీటర్ల రైలురోడ్డు వంతెనకు ప్రారంభోత్సవం చేస్తూ వక్కాణించారు. రు. 12.2 కోట్ల వ్యయంతో వంతెన నిర్మాణం చేయడానికి ఇంజనీర్లు అనుసరించిన ఆధునిక పద్ధతులు అత్యంత గర్వకారణమైనవని రాష్ట్రపతి పేర్కొంటూ ప్రజలు ధైర్యంతో, దృఢసంకల్పంతో, అచంచల విశ్వాసంతో పురోగమించ గలరని, అనటానికి ఇది చక్కని ప్రతీక అని రాష్ట్రపతి పేర్కొన్నారు.

గ్రామీణ ప్రజ మరింతసౌఖ్యవంతమైన జీవితాన్నిగడపగలిగేందుకు వీలుగా భారత్ ఆర్థికాభివృద్ధి ఫలితాలు గ్రామ సీమలకు అందేట్టు చూడవలసివున్నదని రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ ఆలీ అహ్మద్ నేడు పేర్కొన్నారు.

ఈ లక్ష్య సాధనకు దేశంలోని స్త్రీ పురుషులందరి మద్దతు, సహకారం అవసరం. ఇది మనకొక సవాలు వంటిది. ఈ సవాలును మనం సాహసంతో, ఆత్మవిశ్వాసంతో ఎదుర్కొందాం" అని ఆయన అన్నారు.

వ్యవసాయోత్పత్తి పెంపుదలకు, గ్రామీణ కుటీర పరిశ్రమల అభివృద్ధికి అత్యధిక ప్రాధాన్యం ఇవ్వవలసి వున్నదని శ్రీ ఫక్రుద్దీన్ సూచించారు. పెద్ద పరిశ్రమలు అభివృద్ధి చెందినంత మాత్రాన కోట్లాది భారతీయుల సమస్య పరిష్కారంకాదు. లఘు పరిశ్రమలు— పెద్ద పరిశ్రమల అభివృద్ధి తులానాసంగా సాగాలి. ఇవి రెండూ ఒకదానిపై ఒకటి ఆధారపడి వున్నవి" అని ఆయన అన్నారు.

ఈ సందర్భంలో జరిగిన సభకు ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు అధ్యక్షతవహించారు.

పి. డబ్ల్యు. డి. మంత్రి శ్రీ చనుమోలు వెంకటరావు స్వాగతం చెప్పారు.

అంతకు ముందు రాష్ట్రపతి భారత వైమానిక దళానికి చెందిన ప్రత్యేక విమానంలో హైదరాబాదు నుండి ఇక్కడికి సమీపంలోని మధురపూడి విమానాశ్రయంలో దిగారు. ఆయన వెంట ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు, రైల్వేశాఖ మంత్రి శ్రీ ఎల్. ఎన్. మిశ్రా, రైల్వేబోర్డు చెయిర్మన్ శ్రీ బరీ, దక్షిణ మధ్యరైల్వే జనరలు మేనేజరు శ్రీ రాజన్, ప్రభృతులు ఉన్నారు.

విమానాశ్రయం వద్ద 'రాష్ట్రపతికి మంత్రులు శ్రీ బత్తిన సుబ్బారావు, శ్రీ చనుమోలు వెంకటరావు, తూర్పు గోదావరి జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ ఎస్. పి. బి. కె. సత్యనారాయణరావు కలెక్టరు శ్రీ రంగాచారి, పలువురు పార్లమెంటు సభ్యులు, శాసనసభ్యులు వేలాది ప్రజానీకం స్వాగతం చెప్పారు.

మధురపూడి విమానాశ్రయం నుండి రాజమండ్రి కొత్తరైలురోడ్డు వంతెనవరకు రోడ్డు కిరువైపులా వేలాది ప్రజలు స్త్రీలు, పిల్లలు, పురుషులు, రాష్ట్రపతి ప్రభృతులకు అపూర్వ స్వాగతం ఇచ్చారు.

రాజమండ్రి వైపున రోడ్డు వంతెన విభాగానికి రాష్ట్రపతి ఈ ఉదయం సరిగ్గా గం. 10—15 ని. లకు ప్రారంభోత్సవం చేశారు. అనంతరం కొత్తరోడ్డు వంతెనపై కొవ్వూరు వెళ్లారు. కొవ్వూరులో సరిగ్గా గం. 10—28 ని.లకు రైలు వంతెన విభాగానికి ప్రారంభోత్సవం చేసి, రాజమండ్రి స్టేషనుకి రైలులో వచ్చారు. అక్కడ నుండి లాల్‌బహదూర్ స్టేడియంలో జరిగిన బహిరంగ సభలో పాల్గొన్నారు. రాజమండ్రి, కొవ్వూరు పట్టణాలు ఇవాళ ఉత్సవ శోభను సంతరించుకున్నాయి. అశేష జనం రోడ్లపైన, చెట్లపైన, గోడలపై నగోదావరిఒడ్డున నిలబడి తమకు నూతన శోభను ఉజ్వల భవిష్యత్తును ప్రసాదించిన రైలురోడ్డు వంతెన ప్రారంభోత్సవాన్ని తిలకించారు.

రాష్ట్రపతి తమ ప్రసంగంలో ఇలా అన్నారు.:

"గోదావరి నదిపై రైలు— రోడ్డు వంతెనకు ప్రారంభోత్సవం చేసేందుకు ఇక్కడకు రావడం నాకు సంతోషంగా వుంది. ఆసియాలోకెల్లా పొడవైన ఈ రైలు— రోడ్డు వంతెన నిర్మాణం పూర్తి కావడంలో, ఈప్రాంతంప్రజల చిరకాలవాంఛ నెరవేరి రాష్ట్ర ప్రగతి, అభ్యుదయానికి దోహదకారి అయింది. ఈ అద్భుత విజయాన్ని సాధించినందుకు రైల్వేమంత్రిత్వ శాఖకు, ఆంధ్రప్రదేశ్ ప్రజలకు, ప్రభుత్వానికి నా అభినందనలు తెలియచేస్తున్నాను.

"అతి నైపుణ్యంతో పని చేసిన ఇంజనీర్లు, సాంకేతిక నిపుణులు, సిబ్బంది, కార్మికులను కూడా నేను అభినందిస్తున్నాను. భారతీయ ఇంజనీర్లు వంతెనల నిర్మాణంలో అత్యాధునికమైన ఇంజనీరింగ్ పద్ధతులు అవలంబిస్తున్నారు. వంతెనల నిర్మాణంలో చరిత్రలో వీరు అత్యంత గణనీయమైన విజయాలు సాధించారు. అత్యాధునికమైన "కాంటిలివర్ పద్ధతి" ద్వారా నిర్మించిన ఉక్కు దూలాల కోసం భారత్‌లో తయారైన "హై టెన్షన్ స్టీలు"తో నిర్మించిన తొలి వంతెన ఇది అని తెలుసుకుని నేను ఎంతో సంతోషించాను. ఇది గర్వించదగిన ఇంజనీరింగ్ ప్రతిభ. ఈ వంతెన నిర్మాణం సాహసం, కృతనిశ్చయం, ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగాలన్న జాతి ఉత్సాహానికి ప్రతీకగా నేను భావిస్తున్నాను."

"స్వాతంత్ర్యం సిద్ధించిన అనంతరం భారత రైల్వేలు దేశ ఆర్థిక, సాంఘిక, పారిశ్రామికాభివృద్ధిలో ప్రముఖ పాత్ర వహించాయి. పెద్ద పెద్ద నదుల పై వంతెనలు కట్టాయి. మారుమూల ప్రాంతాలకు సత్వరగతిని పట్టణాలు, నగరాలతో సన్నిహిత సంబంధాలు కలుగ జేశాయి. ఈ వంతెన ఈ ప్రాంతంలో ప్రయాణపు రద్దీ అవసరాలు తీర్చి, భారత రైల్వేలలో రద్దీఎక్కువగా వుండే ట్రంక్ మార్గాలలో ఒకటైన మద్రాసు— కలకత్తా మార్గంలో రవాణా ఇబ్బందులను తొలగించగలదని తెలుసుకొని నేను సంతోషించాను"

"సుదీర్ఘమైన భారత దేశ చరిత్రలో గొప్ప ఉద్యమాలన్నింటిలోను ఆంధ్రులు పాల్గొనడమే కాకుండా రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక రంగాల్లో ఉత్తర— దక్షిణాది ప్రాంతాల మధ్య వ్యత్యాసాలు తగ్గించడంలో ప్రముఖ పాత్ర నిర్వహించారు. గోదావరినది ఒడ్డున గల ఈ రాజమహేంద్రవర పట్టణం వందలాది సంవత్సరాలుగా అధ్యయనం,కళలు, వాణిజ్య, సాంస్కృతిక రంగాలకు నిలయమై వున్నది.

ఆంధ్రజాతి రత్నాలలో ఒకరు, ఈ ప్రాంతపు వాసి అయిన వీరేశలింగం సంఘ సంస్కరణ ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన వ్యక్తి. సాంఘిక న్యాయ సాధనకు, స్త్రీ విద్యాభివృద్ధికి ఆయన ఎంతో కృషి చేశారు. తన కాలంలో సమాజాన్ని పట్టి పీడిస్తున్న ఎన్నో దురాచారాలు, మూఢ నమ్మకాలతో పోరాటం జరిపారు. ఆంధ్ర ప్రదేశ్ ప్రజలు మహాత్మాగాంధి చైతన్యవంతమైన నాయకత్వం కింద సాగిన చరిత్రాత్మకమైన స్వాతంత్ర్య పోరాటంలో ప్రముఖ పాత్ర వహించారు. స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత తమ సోదర భారతీయులతో కలిసి దేశాభ్యుదయ కృషిలో ప్రముఖస్థానం వహిస్తున్నారు.

"ఆంధ్రప్రదేశ్‌లో వివిధ రంగాల్లో గణుతికెక్కిన పలువురు ప్రముఖులు ఆవిర్భవించారు. వీరు రాజకీయ రంగంలో ఉన్నత స్థానాలను అలంకరించి, నవభారత నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించారు. గత 25 సంవత్సరాల కాలంలోను మనం మన భూతిక వనరులను పెంపొందించుకొని, భారత దేశాన్ని శాంతి, సంపదలతో వర్ధిల్లే పుణ్య భూమిగా రూపొందించడానికి యత్నిస్తున్నాము. మనం పారిశ్రామికీకరణ పథంలో గట్టి పునాది వేసుకొనగలిగాం. పెక్కు భారీ పథకాలను అమలు జరుపుకొనగలిగాం."

"కుల, వర్గ, వర్ణ భేదాలు లేకుండా ప్రతి పౌరునికి సమాన హక్కులు వుండే లౌకిక, ప్రజాస్వామ్య సోషలిస్టు వ్యవస్థకు మనం పునాదులు వేసుకున్నాం. వ్యవసాయం, పరిశ్రమలు, సాంకేతిక, విజ్ఞాన శాస్త్ర రంగాల్లో శీఘ్రగతిని అభివృద్ధి సాధించాం. మనం సాధించిన ప్రగతి గర్వించదగినదే కాని, మనం రాజకీయ స్వాతంత్ర్యంతో పాటు, ఆర్థిక స్వాతంత్ర్యం కూడా సాధించాలని చెప్పుకోగలగడానికి ఇంకా చాలా కృషి చేయాల్సి వుంది. మన ప్రణాళిక లన్నీ ఈ లక్ష్య సాధనకు ఉద్దేశించినదే. నేడు మనం చేసే కృషిని బట్టి మన భవిష్యత్తు నిర్ణయమవుతుంది.

"మన దేశాన్ని స్వయం సమృద్ధం చేయడానికి, మన ప్రజల జీవన ప్రమాణాలు పెంపొందించే ఉద్దేశంతో మనం కీలక, మౌలిక పరిశ్రమలు నెలకొల్పాం. అయితే పెద్ద పరిశ్రమలు అభివృద్ధి చెందినంత మాత్రాన దేశంలోని కోట్లాది ప్రజల సమస్య పరిష్కారం కాదని గుర్తుంచుకోవాలి. వ్యవసాయోత్పత్తి, ఉత్పాదకశక్తి పెంపుదలకు మనం అధిక ప్రాధాన్యం ఇవ్వాలి. గ్రామీణ, కుటీర పరిశ్రమలకూ కూడా పెద్ద ఎత్తున అభివృద్ధి చేశారు. మన ప్రజలకు విశేషావకాశాలు కలుగచేయాలని మనం వాంఛిస్తున్నాం. పెద్ద పరిశ్రమలు, చిన్న పరిశ్రమలు తులామానంగా అభివృద్ధి చెందేట్టు చూడాలి. ఇవి రెండు ఒక దానిపై మరొకటి ఆధారపడి వున్నది. అనుబంధము లైనవి."

"మీ ప్రాంతం దేశంలోని అత్యంత సారవంతమైన ప్రాంతాలలో ఒకటి. ఇక్కడ చాలా పంటలు, ఫలాలు పుష్కలంగా పండుతాయి. మీ వనరులను — అంగబలాన్ని, వస్తువులను పూర్తిగా వినియోగించుకొనగలిగేందుకు వీలుగా వీరు ఇక్కడ వ్యవసాయ ఆధారమైన పరిశ్రమలు అధికంగా నెలకొల్పాలి. మన పెరుగుతున్న జనాభాకు అధికంగా ఉపాధి అవకాశాలు కల్పించడానికి ఇది తోడ్పడుతుంది. మన వ్యవసాయ రంగం పునాదులు గట్టిగా లేకపోతే, పారిశ్రామిక రంగానికి కూడా గట్టి పునాది ఏర్పడదు. మనం ఆహార రంగంలో విఫలమైతే, అన్నీ తలక్రిందులవుతాయి. మన వ్యవసాయరంగం పటిష్ఠంగా వుండి, స్వయం సమృద్ధి సాధించగలిగితే, పారిశ్రామిక రంగంలో కూడా మనం సత్వరాభివృద్ధిని సాధించడం తేలిక కాగలదు.

"ప్రగతిశీలకము, సౌభాగ్యవంతమైన భారతదేశ నిర్మాణం అత్యంత సాహసోపేతమైన చర్య. ఈ అద్భుత లక్ష్య సాధనలో మనం నిరుగ్నులమై వున్నాము. దీనికి ప్రజల సమైక్య కృషి అభీష్టం అవసరం. దేశసేవకు మనం పునరంకితులం కావాలి. మనంగతంలో సాధించిన విజయాలను స్మరణకు తెచ్చుకొని, ఉత్తేజం తెచ్చుకొని, మనం సాధించవలసిన లక్ష్యాన్ని అనుసరిద్దాం. ఎన్ని కష్టాలు వచ్చినా, మన జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమం కొనసాగించడానికి మనం కృతనిశ్చయులమై ఉన్నాం.

"మనమంతా సంఘటితంగా నిలవాలి. మహాత్మా గాంధి నాయకత్వాన జరిపిన స్వాతంత్ర్య పోరాటపు రోజులు నాటి ఐక్య

మిగతా 2 వ పేజీలో






## లైసెన్సుల కుంభకోణం: లోక్‌సభలో నల్గురు మంత్రులపై ప్రతిపక్ష నాయకుల తీవ్ర విమర్శ

న్యూఢిల్లీ, నవంబరు 20 : దిగుమతి లైసెన్సుల కుంభకోణానికి సంబంధించి సభాహక్కులకు భంగం కలిగించినందుకు, సభను ధిక్కరించినందుకు నలుగురు కేంద్ర మంత్రులను నేడు లోక్‌సభలో నలుగురు ప్రతిపక్ష నాయకులు ఒకపూపు పూపారు. శ్రీ తుల్‌మోహన్‌రావుపై న్యాయస్థానంలో చర్యతోబాటు సభాహక్కుల సంఘంచే విచారణ కూడా జరిపించాలని వారు కోరారు.

శ్రీ ఉమాశంకర్‌దీక్షిత్, న్యాయ శాఖా మంత్రి శ్రీ గోఖలే, దేశీయాంగ మంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి, వాణిజ్య మంత్రి ప్రొఫెసర్ చటోపాధ్యాయ దురుద్దేశంతో వ్యవహరించారని, పై కేసుకు సంబంధించి సభకు యిచ్చిన వాగ్దానాలను భంగపుచ్చారని శ్రీ మధులిమాయే (ఎస్. పి) జ్యోతిర్మయిబోసు (మార్క్సిస్టు) ఎస్. ఎన్. మిశ్రా (సంస్థా కాంగ్రెసు) ఎ. బి. వాజపాయ్ (జన సంఘం) ఆరోపించారు.

తమపై కేసు కోర్టు విచారణలో ఉండగా సభలో చర్చ జరిగితే తమ కేసుకు భంగం కలగవచ్చునని, అందువల్ల సభలో చర్చ జరగరాదని విజ్ఞప్తి చేస్తూ శ్రీ తుల్‌మోహన్‌రావ్ వ్రాసిన లేఖను సభాపతి అంతకు ముందు సభలో చదివి వినిపించారు. ఈ లేఖను సభ్యులందరికీ పంపడానికి సభాపతి అంగీకరించారు.

శ్రీ లిమాయే, శ్రీ బోసు మాట్లాడుతూ, సెప్టెంబరులో ఈ విషయంపై చర్చ జరుగుతున్నప్పుడు అప్పటి దేశీయాంగ మంత్రి శ్రీ దీక్షిత్, న్యాయశాఖమంత్రి, సి. బి. ఐ. దర్యాప్తు పూర్తి కాగానే ప్రభుత్వం నాస్తవాలను సభముందుంచి సభ సలహాలను కోరగలదని నిస్సష్టంగా హామీ యిచ్చారని అన్నారు. కాగా ప్రభుత్వం కోర్టుకు వెళ్లి సభాహక్కులకు భంగం కలిగించిందని, సభను ధిక్కరించిందని వారు పేర్కొన్నారు.

ప్రభుత్వం తీసుకున్న ఈ చర్య దురుద్దేశపూరితమని, శ్రీ తుల్ మోహన్‌రావ్‌పై సభాహక్కుల సంఘం ద్వారా పార్లమెంట్ స్వతంత్రంగా చర్య తీసుకునే అవకాశాన్ని ఎందుకు నిరాకరించాలో తమకు అర్థం కావడం లేదని శ్రీ లిమాయే అన్నారు.

ఈ సమస్యను సంతృప్తికరంగా పరిష్కరించకపోతే సభాకార్యక్రమాలను ముందుకు సాగనివ్వబోమని ప్రతిపక్ష నాయకులు హెచ్చరించారు.

ఈ వ్యవహారానికంతటికీ వెనుకవున్న కర్త శ్రీ ఎల్. ఎన్. మిశ్రా అని శ్రీ జ్యోతిర్మయి బోసు ఆరోపించారు.

శ్రీయుతులు మధులిమాయే, జ్యోతిర్మయి బోసు, ఎస్. ఎన్. మిశ్రా అటల్‌బిహారీ వాజపాయ్ ప్రతిపాదించిన ఈ హక్కుల తీర్మానాలపై దాదాపు రెండు గంటలసేపు చర్చ జరిగింది. ఆ తర్వాత ఈ సమస్య పరిశీలనను సభాపతి రేపటికి వాయిదా వేశారు. తాము ఎప్పుడు కావాలంటే అప్పుడు ప్రకటన చేయడానికి సిద్ధంగా ఉన్నామని దేశీయాంగమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి తెలిపారు.

## వివిధరాష్ట్రాల్లో అధికార్లచే 50 వేలదాడులు: 98 వేల టన్నుల అక్రమ నిల్వలు స్వాధీనం

న్యూఢిల్లీ, నవంబరు 20 : 1974 జనవరి 1 నుండి వివిధ రాష్ట్రాలలో అధికారులు జరిపిన 55000 దాడులలో సుమారు 98000 టన్నులు ఆహార ధాన్యాల దొంగ నిల్వలను బయటకు తీసినట్లు రాజ్యసభలో కేంద్ర వ్యవసాయ సహాయమంత్రి శ్రీ ఎ. పి. షిండే నేడు తెలియజేశారు.

శ్రీ కె. చంద్రశేఖరన్ వేసిన ప్రశ్నకు మంత్రి సమాధానం చెబుతూ పశ్చిమ బెంగాల్‌లో ఆహార ధాన్యాలను అక్రమంగా నిల్వ చేసినందుకు రాష్ట్ర ప్రభుత్వం 3323 మందిని మీసా నిబంధనల క్రింద అరెస్టు చేసిందని, ఒరిస్సాలో 17 మందిని, తమిళ నాడులో 18 మందిని అరెస్టు చేశారని కూడా మంత్రి వివరించారు.

వివిధ రాష్ట్రాలలో దాడులు జరిపిన చేశరక్షణ నిబంధనలు, మీసా నిబంధనల క్రింద మొత్తం 5392 మందిని అరెస్టు చేశారని మంత్రి చెబుతూ, అక్రమ నిల్వలను వెలికి తీయటం వలన ఆహార ధాన్యాల ధరలు తగ్గుముఖం పట్టాయని పేర్కొన్నారు.

కాంగ్రెసు సభ్యురాలు శ్రీమతి సుమిత్రా కులకర్ణి ప్రసంగిస్తూ ప్రభుత్వం సాగిస్తున్న అక్రమ ధాన్యాల వెలికి తీసే ఉద్యమం కన్నీళ్లు తుడవటానికే అన్నట్లుగా వున్నదని, దేశంలో ఎంత మేరకు ఆహార ధాన్యాల అక్రమంగా నిల్వ ఉన్నాయో ప్రభుత్వం వద్ద అంచనాలు ఉన్నాయా అని అడిగారు. దీనికి శ్రీ షిండే సూటిగా సమాధానం చెప్పకుండా, అక్రమ నిల్వలపై అంచనాలు రకరకాలుగా ఉన్నాయని అన్నారు.

### గోధుమ సేకరణ

ఈ సంవత్సరం నవంబరు 18 వరకు 18,60,000 టన్నుల గోధుమను సేకరించటం జరిగిందని రాజ్యసభలో కేంద్ర వ్యవసాయ సహాయమంత్రి శ్రీ షిండే నేడు తెలియజేశారు.

1974—75 రబీ పంటకాలానికి గోధుమ సేకరణకు రాష్ట్రాలలో లక్ష్యం నిర్ణయించలేదని భూమి శిస్తు డబ్బు రూపంలో కాకుండా వస్తురూపంలో వసూలు చేయాలని శ్రీ కృష్ణకాంత్ చేసిన సూచన ఆచరణ యోగ్యం కాదని శ్రీ షిండే అన్నారు.

—o:o—

న్యూఢిల్లీ, నవంబరు20 : సూడాన్ అధ్యక్షుడు శ్రీ నిమెరీ ఆయన సతీమణి ఈ నెల 26 నుండి 30వరకు భారత్‌లోపర్యటిస్తారు.

రాష్ట్రపతి శ్రీ అహ్మద్ ఆహ్వానంపై వారు భారత్ వస్తున్నారు. సూడాన్ అధ్యక్షుడొకరు భారత్‌కు రావటం యిదే ప్రథమం.

## జాతి సమైక్యతకు చిహ్నం: రైల్వే మంత్రి అభిభాషణ

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

రాజమండ్రి, నవంబరు 20 : గోదావరి నదిపై నిర్మించుకుని, నేడు ప్రారంభోత్సవం జరుపుకున్న రైలు—రోడ్డు వంతెన చుట్టుపట్ల ప్రాంతాల అభ్యుదయానికి నాంది కాగలదనీ, ఉత్తర, దక్షిణ దేశాల ప్రజల మధ్య బంధాలను పటిష్ఠం చేయగలదనీ రైల్వే మంత్రి శ్రీ లలిత్‌నారాయణ్ మిశ్రా ఆశాభావం వ్యక్తంచేశారు.

ఈ వంతెనను జాతిసమైక్యతకు చిహ్నంగా అభివర్ణిస్తూ, ఆసియాలోకెల్లా మిక్కిలి పొడవైన ఈ రైలు—రోడ్డు వంతెనను కేవలం దేశీయ నిపుణులే డిజైన్ చేసి, నిర్మించడం గర్వకారణమని రైల్వే మంత్రి అన్నారు. నిర్మాణం జరుగుతుండగా రోడ్డు కూడా వేయాలని తలపెట్టి డిజైన్‌లో మార్పు చేయడం వల్ల వంతెన నిర్మాణం పూర్తి కావడానికి పది సంవత్సరాలు పట్టిందని తెల్పారు. పొడుగైన స్తంభాలతో, నీటిమట్టానికి 75 అడుగుల ఎత్తున రోడ్డు నదుపాయంతో నిర్మించబడిన ఈ వంతెన ప్రజల చిరకాల అభీష్టాన్ని నెరవేర్చిందని ఆయన అన్నారు.

ఈ వంతెన నిర్మాణంవల్ల ఉత్తర, దక్షిణ దేశాలమధ్య, రైలు, రోడ్డు రవాణా ఆపనరాలు తీరి, శతాబ్దాలుగా పీడిస్తున్న రవాణా ఇబ్బందులు తొలగిపోయినందుకు తాము ఆనందిస్తున్నామని శ్రీ మిశ్రా అన్నారు. రైల్వే వ్యవస్థలో మిక్కిలి రద్దీగా ఉండే ట్రంక్ మార్గాలలో ఒకటైన మద్రాసు — హౌరా మార్గంలో ఇకమీదట రాకపోకలు సాఫీగా, శీఘ్రంగా, చవుకగా నిర్వహించబడగలవన్న ఆశాభావాన్ని వెల్లడించారు.

వంతెన నిర్మాణాన్ని పూర్తిచేయడంలో రైల్వే ఇంజనీర్లు ప్రదర్శించిన నైపుణ్యాన్ని, మేధాశక్తిని ప్రశంసిస్తూ, లోతైన గోదావరి నదీగర్భంలో పునాదులు వేయడంలోనూ, స్తంభాలు నిర్మించడంలోనూ, తదితర పనుల లోనూ ఎదురైన సమస్యలన్నిటినీ వారు పరిష్కరించగలిగారని మంత్రి అన్నారు.

## అణ్వస్త్రాల వ్యాప్తి నిరోధం ఆవశ్యకత: ఫోర్డ్, తనాకాల ప్రకటన

టోక్యో, నవంబరు 20: అణ్వస్త్రాల వ్యాప్తిని నిరోధించడం అవసరమని అమెరికా అధ్యక్షుడు ఫోర్డ్, జపాన్ ప్రధాని కుకేయి తనాకాలు నేడు ఆమోదించారు.

అమెరికా అధ్యక్షుని పర్యటన ముగిసిన సందర్భంలో నేడిక్కడ సంయుక్త ప్రకటన వెలువడింది.

అణ్వస్త్రాలు కలిగివున్న అమెరికా యుద్ధ నౌకలు జపాన్ రేవుల కు వస్తున్నట్లు ఇటీవల వెలువడిన వార్తల వల్ల జపాన్ ప్రజలకు కలిగిన భయాందోళనలను తొలగించే లక్ష్యముతో ఫోర్డ్, తనాకాలు తమ సంయుక్త ప్రకటనలో పై విధంగా తెలిపినట్లు పరిశీలకులు భావిస్తున్నారు.

అణ్వస్త్రాలు లేని దేశాలను అణ్వస్త్ర దేశాల ప్రమాదం నుంచి రక్షించవలసిన బాధ్యతను తమ ఉభయ ప్రభుత్వాలు గుర్తించినవని ఈ ప్రకటనలో పేర్కొన్నారు.

ఈ ప్రకటన విడుదల కావడానికి ముందు కూడా ఫోర్డ్, తనాకాలు నేటి ఉదయం కలుసుకుని సంభాషణలు జరిపారు.

అమెరికా జపాన్‌లు అన్ని సమస్యలపైనా ఎప్పటికప్పుడు పరస్పరం సంప్రతింపులు జరుపుకోవాలనిఇద్దరునాయకులుఅంగీకరించారు.

## దిగువ అస్సాంలో పలుపట్టణాల్లో అల్లర్లు; పోలీస్ కాల్పులు: పదిమంది మృతి

గౌహతి, నవంబరు 20: దిగువ అస్సాంలో గోల్పారా జిల్లాలో నిన్న పలు ప్రాంతాలలో మైదాన జాతుల వలంటీర్లు, పోలీసులకు మధ్య జరిగిన తీవ్రమైన కొట్లాటల్లో ఎనిమిది మంది మరణించినట్లు, 100 మందికి పైగా గాయపడినట్లు వార్తలు వచ్చాయి. మరణించిన వారిలో ఇద్దరు మైదాన జాతుల వారు, యిద్దరు సి. ఆర్. పి. దళ సభ్యులు. గాయపడిన వారిలో ఉభయ పక్షాల వారు వున్నారని తెలుస్తున్నది.

అస్సాంలో మైదాన జాతులవారు వున్న ప్రాంతాలలో గల పాఠశాలల్లో అస్సామీ భాషకు బదులు రోమన్ లిపిని ప్రవేశపెట్టాలని నిన్న తెగల వారు తీవ్ర ఆందోళన మొదలు పెట్టారు.

గోల్పారా జిల్లాలోని ధుబ్రిలో సబ్ డివిజనల్ కలెక్టరు కార్యాలయం వద్దకు వచ్చిన 10 వేల మంది సాయుధ దేగంవారిని చెదరగొట్టడానికి పోలీసులు కాల్పులు జరుపగా ముగ్గురు తెగలవారు అక్కడికక్కడే మరణించారనీ మరో ఏడుగురికి తుపాకి గుండు దెబ్బలు తగిలాయనీ అధికార వార్తల వలన తెలుస్తున్నది.

అంతకు ముందు కోపోద్రిక్తులైన ప్రజలు జరిపిన దాడులతో పదిమంది పోలీసులకు తీవ్ర గాయాలు తగిలాయి. పోలీసులు పరిస్థితిని అదుపులోనికి తెచ్చినప్పటికీ ఆ ప్రాంతంలో యింకా ఉద్రిక్త స్థితి కొనసాగుతూనే వుంది.

ఈ నెల 18 వ తేదీన సిడ్లి పట్టణంలో ప్రారంభమైన యీ ఆందోళన నిన్న బిజని, కాక్రఝార్, బొంగైగాం, నపట్‌గ్రామ్‌లకు వ్యాపించింది. 18 వ తేదీన సిడ్లిలో ఆందోళన కారులపై పోలీసులు జరిపిన కాల్పులలో ఇద్దరు తెగవారు మరణించారు. సిడ్లిపట్టణంలో రెండు వేల మంది ఆందోళనకారులు ఆయుధాలతో ప్రభుత్వ కార్యాలయాలపై దాడి చేశారు. నిన్న పలు పట్టణాలలో కూడా వేలాది ఆందోళన కారులు సబ్‌డివిజనల్ కలెక్టర్ల కార్యాలయాలపై, బి. డి. ఒ. కార్యాలయాల పై దాడులు జరిపారట.




"మళ్లా మధ్య మధ్య ఈ ఆకలి చావుల వార్తలేవిటి సార్ !"

## విమానంకూలి 77మందిమృతి

నైరోబి, నవంబరు 20: జోహాన్స్‌బర్గ్ వెడుతున్న లుఫ్తాన్సాబోయింగ్ 747 జంబో జెట్ విమానం నేడు నైరోబి విమానాశ్రయంనుంచి బయలుదేరిన కొద్ది నిముషాలలో కూలిపోయిందని విమానాశ్రయం వద్దాం వారు చెప్పారు.

ఈ ప్రమాదంలో 77 మందిమరణించినట్లు వైమానిక సంస్థ ప్రతినిధి చెప్పారు.

ఈ లుఫ్తాన్సా జెట్ విమానం భారతకాలమానం ప్రకారం తెల్లవారుజామున రెండు గంటలకు ఫ్రాంక్‌ఫర్ట్ నుంచి నైరోబి వచ్చింది. ఈ విమానం మళ్లీ నైరోబినుంచి భారత కాలమానం ప్రకారం ఉదయం 10.20 గంటలకు జోహాన్స్‌బర్గ్ బయలుదేరి వెళ్లవలసివుంది.

ఈ విమానం కూలిపోయినట్లు ఫ్రాంక్‌ఫర్ట్‌లోని లుఫ్తాన్సా విమానసంస్థ అధికారులు ధ్రువపరచారు కాని, విమానంలో 139 మంది ప్రయాణీకులు మాత్రమే వున్నట్లు తాము భావిస్తున్నామని తెలిపారు.వీరుకాక 18 మంది విమాన చోదక సిబ్బందికూడా ఉంది.

బెంగుళూరు,నవంబరు20: వెస్ట్ ఇండీస్‌తో జరుగనున్న మొదటి క్రికెట్ టెస్టులో ఆడే భారతీయ జట్టునుంచి బిషన్‌సింగ్‌బేడిని తొలగించినందుకు నిరసనగా నిన్న ఉదయం ఇక్కడ ప్రభుత్వ ఆర్ట్సు, సైన్సు కళాశాల, న్యాయ శాస్త్ర కళాశాలలకు చెందిన సుమారు 500 మంది విద్యార్థులు తరగతులకు గైరు హాజరయ్యారు.

## పాట్నాలో సి.పి.ఐ., కాంగ్రెస్ ఉద్యమాలు విఫలం: భండారీ వివరణ

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, నవంబరు 20 : బీహారులో ప్రస్తుతం సాగుతున్న ఆందోళనకు వ్యతిరేకంగా మితవాద కమ్యూనిస్టుపార్టీ, కాంగ్రెస్‌పార్టీ బ్రహ్మాండంగా పాట్నాలో జరిపినట్లు చెబుతున్న వూరేగింపులు నిజానికి పూర్తిగా విఫలమయిన వూరేగింపులని, బీహార్ శాసనసభ సస్పెన్షన్ జరుగుతుండంటూ ఇప్పుడు వస్తున్న సూచనలే దానికి రుజువు అని, అఖిలభారత జనసంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ సుందర్‌సింగ్‌భండారీ నిన్న రాత్రి ఇక్కడ ఒక బహిరంగసభలో చెప్పారు. పాట్నా పౌరులు ఈ వూరేగింపులను గురించి అసలు పట్టించుకోలేదని, కిరాయి మనుషులు ఎంతగా రెచ్చగొట్టినా వారు తమ దైనందిన కార్యకలాపాలు మామూలుగా సాగించుకున్నారని ఆయన అన్నారు.

శాసనసభను రద్దు చేయమని కోరడంలో ప్రజాస్వామ్యవిరుద్ధమయిన అంశం ఏమిటని ఆయన ప్రశ్నించారు. ఆందోళనకారులు తమకు అధికారం యివ్వవలసిందని అడగడంలేదని, తిరిగి ప్రజల ఆదేశం పొందవలసిందని, మాత్రమే కోరుతున్నారని, ఆయన అన్నారు. 1971—72 ఎన్నికల్లో చేసిన వాగ్దానాల అమలులో పాలకపక్షం పూర్తిగా విఫలమైనందున ఇలా కోరడం అవసరమయిందని ఆయన తెలిపారు. కాంగ్రెసు తన వాగ్దానాల విషయంలో నిజాయితీతో వ్యవహరించి ఉంటే, ఈనాడు అత్యవసర వస్తువులకు దారుణమైన కొరత సంభవించి ఉండేది కాదని ఆయన అన్నారు. ఆంధ్ర విషయంలో కూడా కేంద్రం వైఖరి భిన్నంగా లేదని, విశాఖ ఉక్కు కర్మాగారం విషయంలోను, నదీ జలాల పంపిణీ విషయంలోను ఈ దురదృష్ట పరిస్థితికి ఆంధ్ర కూడా గురి అవుతున్నదని శ్రీ భండారీ వివరించారు.

అంతరంగిక భద్రతా పరిరక్షణ శాసనం (మైసా) విషయంలో కోర్టుకు వెళ్లడానికి వీలు లేదని ఉత్తర్వు చేయడంలో నియంతృత్వ అధికారాలను ప్రభుత్వం చేపట్టడం దాదాపు పూర్తి అయిందని ఆయన అన్నారు. బీహార్ ఆందోళన ఆశయం దేశమంతటికీ వ్యాపిస్తున్నదని, భూమిపై ఏ శక్తి దాన్ని అణచాలదని ఆయన అన్నారు.

సభకు నగర జనసంఘం అధ్యక్షుడు శ్రీ బంగారులాల్ విజయవర్గీయ అధ్యక్షత వహించారు. మహారాజ్ గంజ మండల్ అధ్యక్షుడు శ్రీ జైకరన్ వేదికను అలంకరించారు. మహారాజ్ గంజ మండల్ కార్యదర్శి శ్రీ గోవిందలాల్ రాటీ స్వాగతం పలికారు. న్యాయవాది శ్రీ భరత్‌సింగ్ వందనసమర్పణ చేశారు.

## జీపు ప్రమాదంలో భండారీకి తీవ్రంగా గాయాలు

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, నవంబరు 20 : అఖిల భారత జనసంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ సుందర్‌సింగ్ భండారీ నేడు జీపులో తాండూర్ వెడుతుండగా గండిపేట వద్ద ప్రమాదానికి గురయి తీవ్రంగా గాయపడ్డారు. ఆయన గూటి ఎముక విరిగింది. తల వెనుక భాగానికి గాయమైంది.

ఆయనతోబాటు జీపులో రాష్ట్ర జనసంఘం కార్యదర్శి శ్రీ బంగారు లక్ష్మణ్ మరో నలుగురున్నారు. వారు స్వల్పంగా గాయపడ్డారు.

శ్రీ భండారీని ఉస్మానియా ఆసుపత్రిలో చేర్చారు. శ్రీ భండారీ ప్రభృతులు ప్రయాణం చేస్తున్న జీపు తలక్రిందులయినప్పుడు ఈ ప్రమాదం సంభవించింది.

## రాష్ట్రపతి హైద్రాబాద్ పునరాగమనం

హైదరాబాద్, నవంబర్ 20: గోదావరిపై రాజమండ్రివద్ద నిర్మించబడిన రైలు, రోడ్ వంతెనకు నేటి ఉదయం ప్రారంభోత్సవం చేసిన అనంతరం రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్అలీఅహ్మద్ నేటి మధ్యాహ్నం యిక్కడకు తిరిగి వచ్చారు.

రాష్ట్రపతి ప్రయాణించిన విమానం నాగార్జునసాగర్‌డాం మీదుగా వచ్చింది.డాంను, అంచులదాకా నీటితో నిండివున్న విశాలమైన జలాన్ని కొన్ని స్లూయిస్‌గేట్లగుండా ప్రవహిస్తున్న నీటిని చూసినప్పుడు తమకు ఎంతో ఆనందం కలిగిందని రాష్ట్రపతి చెప్పారు.

## ఖమ్మం జిల్లా గ్రామంలో 4 ఎకరాల గంజాయి తోట

కొత్తగూడెం, నవంబరు 20 : ఆంధ్ర ప్రదేశ్ ఎక్సైజు శాఖ మెరుపు దాడి దళం నిన్న ఖమ్మంజిల్లా, గుండ్లరేవు వద్ద నాలుగు ఎకరాల భూమిలో గంజాయి పెంచబడు తుండడం కనుగొని, లక్ష రూపాయల విలువయిన గంజాయి మొక్కలను స్వాధీనం చేసుకున్నది.

ఈ దాడిని నిర్వహించిన ఇన్‌స్పెక్టర్ శ్రీ సీతారామారావు ఈ సందర్భంగా ముగ్గురు వ్యక్తులను అరెస్టు చేశారు.

## భారత్ కెనడా ఒప్పందం సజీవం

న్యూఢిల్లీ, నవంబరు 20 : అణుశక్తి శాంతియుత ప్రయోజనాలకు వినియోగించే విషయంలో భారత్ కెనడా దేశాలు కుదుర్చుకున్న ఒప్పందం యింకా అమలులో ఉన్నదని లోక్‌సభలో ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి నేడు తెలిపారు.

## గంటల పంచాంగం

శ్రీ ఆనందనామ సం. కార్తీక శు. సప్తమి :
1974 వ సం. నవంబరు 21 గురువారం
గురు : శు. సప్తమి : ప. 2.54, ధనిష్ఠ : ఉ. 6.03, వర్జ్యం : ఉ. 7.36 మొదలు 9.23 వరకు.

1974 వ సం. నవంబరు 22 శుక్రవారం
శుక్ర : శు. అష్టమి : సా. 5.23, శతభిషం : 24.00, వర్జ్యం : ప. 2.05 మొదలు 3.52 వరకు.

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 — 1972)



ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబునకగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మపథముల కెల్లన్
(మహాభారతము)

శ్రీ ఆనందనామ సం. కార్తీక శు. సప్తమి :
గురువారం

## కొత్త గోదావరి వంతెన

—:o:—

గోదావరి రోడ్డు—రైలు వంతెన ప్రారంభోత్సవం సందర్భంలో రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ ఆలీ అహ్మద్ ఆంధ్రప్రదేశ్ ప్రజలని కొనియాడారు. భారతదేశంలో జరిగిన జాతీయోద్యమా లన్నిటిలోనూ తెలుగువారు ప్రముఖ పాత్ర వహించారని ఆయన అన్నారు. ఈ సందర్భంలో శ్రీ అహ్మద్ కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారిని పేర్కొన్నారు. వీరేశలింగంపంతులు గారు గోదావరి ప్రాంతంవారని ఆయన శ్రోతలకి గుర్తు చేశారు. రాష్ట్రపతి ప్రశంసలలో అతిశయోక్తి ఏమీ లేదు. ఆంధ్రప్రదేశ్ ప్రజలలో జాతీయ చైతన్యానికి ఎప్పుడూ కొరత లేదు. సంఘ సంస్కరణ విషయంలో కూడా ఆంధ్రులు ఎప్పుడూ అందరికీ ముందే ఉంటూ వచ్చారు. నాటికీ నేటికీ కూడా తెలుగువారు తమ పురోగమనాన్ని ఎన్నో విధాలుగా ప్రదర్శిస్తూ ఉన్నారు. తమ ఐకమత్యాన్ని కూడా అందరికీ కనిపించేట్లు ప్రదర్శించగలిగితే మరింత ప్రశంసని అందుకొనగలరనటంలో సందేహం లేదు. శ్రీ అహ్మద్ గోదావరి వంతెన జాతీయ సమైక్యత కొక చిహ్నం అన్నారు. అది ఆంధ్రుల సమైక్యతకి కూడా చిహ్నం కావాలని కోరుకొననివారు ఉండరు. రు. 12.22 కోట్ల ఖర్చుతో కట్టబడిన గోదావరివంతెన సమైక్యతకే కాక సాంకేతిక నైపుణ్యానికి కూడా ఒక గొప్ప చిహ్నం. భారతీయులు వారిలో తెలుగువారు తమ నైపుణ్యంతో ఎటువంటి వారిలోనయినా సంభ్రమాశ్చర్యాలని కలిగించగలిగిన నిర్మాణాన్ని ఎన్నో కష్టాలని ఎదుర్కొంటూ పూర్తి చెయ్యగలిగారు. శ్రీ అహ్మద్ స్వయంగా చెప్పినట్లు ఇతర ప్రాజెక్టుల అవసరాల కోసం గోదావరి వంతెన కట్టడంలో ఆలస్యం కొంత అయింది. ఈ ఆలస్యాన్ని అందరూ ఓర్పుతో సహించారు. కొత్త వంతెన రవాణా సమస్య లెన్నిటినో పరిష్కరించగలదని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. గోదావరి డెల్టా ప్రాంతం వారికి వంతెనలు ఇంతకి ముందే ఏర్పరచటం జరిగింది. ఇప్పుడు కలకత్తాకి సరాసరిగా పోయే వారికి గోదావరిమీది వంతెన కొత్త సౌకర్యం కలిగిస్తోంది. ఈ మహత్తర నిర్మాణంలో పాలుగొన్నవారందరూ ఎంతయినా ప్రశంసనీయులు.



రామగుండం ఎరువుల కర్మాగారంలో ఏర్పాటు చేస్తున్న యూరియా సింథసిస్ రియాక్టర్

# రామగుండం ఎరువుల ఫ్యాక్టరీ

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

కరీంనగర్ జిల్లా రామగుండం వద్ద భారత ప్రభుత్వ ఎరువుల సంస్థ ఆధ్వర్యాన నిర్మించబడుతున్న ఎరువుల కర్మాగారం దేశ సస్య విప్లవంలో ప్రధాన భూమిక నిర్వహించనున్నది.

సుమారు రు. 137 కోట్ల రూపాయల వ్యయంతో నిర్మించే రామగుండం ఎరువుల కర్మాగారంలో 1976 జులై నుండి ఉత్పత్తి ప్రారంభమవుతుంది.

ఇప్పుడు దాదాపు 4 వేల మంది కార్మికులు సివిల్ పనులలో నిమగ్నమై ఉన్నారు. సివిల్ పనులు 1975 మే మాసాంతానికి పూర్తి కాగలవు.

కర్మాగారం జనరల్ మేనేజరు శ్రీ పి. ఎల్. కుర్రెజా రామగుండంలో పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ బొగ్గు ముడిపస్తువుగా ప్రపంచంలో నిర్మింపబడుతున్న ప్రథమ కర్మాగారం ఇదేనని అన్నారు.

దాదాపు 43 కోట్ల రూపాయల విలువగల యంత్రాలను పశ్చిమజర్మనీ చెకొస్లవేకియా, ఇటలీకి చెందిన కొన్ని సంస్థలనుండి సాంకేతిక సహకారం కోసం, యంత్రాల కొనుగోలు కోసం ఒడంబడికలు చేసుకున్నారు. మిగిలిన యంత్ర సామగ్రి కోసం దేశంలోని 20 ప్రభుత్వ రంగం ప్రైవేట్ పరిశ్రమలకు ఆర్డర్లు ఇవ్వబడినవని, వారి నుండి యంత్ర పరికరాలు సక్రమంగా రావడంలో జాప్యం జరుగుతున్నదని శ్రీ కుర్రెజా వివరించారు.

కర్మాగారానికి అవసరమైన నీటిని గోదావరి నుండి సరఫరా చేసేందుకు రాష్ట్ర ప్రభుత్వంతో ఒప్పందం చేసుకొన్నట్లు ఆయన తెలిపారు.

కర్మాగారానికి అవసరమైన బొగ్గు సరఫరాకు సింగరేణి కాలరీస్ సంస్థతో త్వరలో ఒప్పందాలు చేసుకోవడం జరుగుతుంది. ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు నిర్మాణం పని విషయంలో శ్రద్ధ తీసుకొంటున్నట్లు తెలుస్తోంది.

కర్మాగారానికి రోజుకి కోటిన్నర గాలనుల నీరు సరఫరా చేసే గొట్టాలను 120 కిలో మీటర్ల విస్తీర్ణంలో నెలకొల్పే కార్యక్రమం 15 మాసాల్లో పూర్తి అవుతుంది. ఇంతవరకు 75 కోట్ల రూపాయల మేరకు వ్యయపరచబడింది. నిర్మాణం 1971లో ప్రారంభమయింది.

కర్మాగారానికి రోజుకు 50 మెగావాట్ల విద్యుత్, సాలుకు 10 లక్షల టన్నుల బొగ్గు అవసరం. కర్మాగారంలోని అధిక భాగం యంత్రాలు అవిరిలో నడుపబడతాయి.

కర్మాగారంలో రోజుకు 900 టన్నుల అమోనియా, 1500 టన్నుల యూరియా ఉత్పత్తి అవుతాయి. సుమారు 300 రోజులు ఉత్పత్తి జరుగుతుంది. కర్మాగారం పూర్తి అయ్యేసరికి 1800 మందికి ఉపాధి లభిస్తుంది. ప్రస్తుతం ఉన్న సాంకేతిక సిబ్బందిలో 86 శాతం, సాంకేతికులు కానివారిలో 97 శాతం, నైపుణ్యం అవసరం లేని సిబ్బంది నూరు శాతం స్థానికులే ఉన్నారని జనరల్ మేనేజర్ అన్నారు.

కర్మాగారంలో ఉత్పత్తి అయ్యే ఎరువులు నింపడానికి రోజుకు 30 వేల నార, పాలిథిన్ సంచులు అవసరం. ఇందు కోసం సమీపంలో నార మిల్లు నెలకొల్పితే ప్రయోజనకరంగా ఉంటుంది. 30 వేల టన్నుల ఎరువులు (15 రోజుల ఉత్పత్తి) నిల్వ చేసే గిడ్డంగి నిర్మాణం పూర్తి అయింది. రైల్వే సైడింగ్‌లు కూడా ఏర్పాటు అయ్యాయి.

రామగుండం ఎరువుల కర్మాగారం ఆంధ్రప్రదేశ్ రైతాంగానికి ఆశా కిరణం అనడంలో సందేహంలేదు.

# షెడ్యూల్డ్ కులాల సమస్యలపై ప్రభుత్వ నిర్లిప్తత

## — రాజ్యసభలో ఆరోపణ

న్యూఢిల్లీ, నవంబరు 20 : కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు షెడ్యూల్డ్ కులాలు, తెగల కమీషనర్ సిఫార్సులపట్ల 'నిర్లిప్త వైఖరి'ని ప్రదర్శిస్తున్నాయని నిన్న రాజ్యసభలో ప్రతిపక్ష సభ్యులు, కాంగ్రెసు సభ్యులు కూడా ఆరోపించారు.

1971—72, 1972—73 సంవత్సరాలకుగాను కమీషనర్ సమర్పించిన నివేదికపై నాలుగు గంటలపాటు జరిగిన చర్చ సందర్భంగా ఈ విమర్శ వచ్చింది. చర్చ ఇంకా పూర్తికాలేదు.

ఈ చర్చ కేవలం 'ఏటాజరిపే తతంగం' వంటిదని కొందరు సభ్యులు అభివర్ణించారు. కమీషనర్ సిఫార్సులనుగాని, పార్లమెంటులో వ్యక్తం చేయబడిన సాధక బాధకాలనుగాని అధికారులు పట్టించుకోకపోవడంవల్ల వారు తమ పనులను పెడచెవిన పెడుతున్నారని (?) వాపోయారు.

హరిజనులను వేధిస్తూండటం, వెనుకబడిన తరగతుల విద్యార్థులకు తగినంతగా విద్యా సదుపాయాలు కల్పించకపోవడం, విద్యార్థి వేతనాలు చెల్లించడంలో జాప్యం చేయడం, ఆదివాసులను అటవీశాఖ అధికారులు వేధిస్తూండటం, ప్రభుత్వ సర్వీసులలో వెనుకబడిన తరగతుల అభ్యర్థులను రిక్రూట్ చేసుకోవడం పట్ల అధికారులు వ్యతిరేక వైఖరి ప్రదర్శిస్తూండటం మొదలైన సమస్యలను చర్చ సందర్భంగా సభ్యులు ప్రస్తావించారు.

శ్రీ ఎన్.జి. గోరే (ఎస్.పి.) ప్రసంగిస్తూ ఆదివాసుల, హరిజనుల సమస్యలు సత్వరం పరిష్కరించేందుకు ప్రత్యేక మంత్రిత్వశాఖను ఏర్పాటు చేయాలని కోరారు.

శ్రీ ఎస్. ఎస్. మరియస్వామి (డి.ఎం.కె) మాట్లాడుతూ, దేశంలో కులవ్యవస్థను రద్దు చేయడానికి అధికారపక్షం కాలపరిమితితో కూడిన ఒక కార్యక్రమాన్ని చేపట్టాలనీ, వెనుకబడిన తరగతులవారికి ఇళ్ళు నిర్మించే విషయంలో తమిళనాడు ప్రభుత్వం నెలకొల్పిన ఆదర్శాన్ని అనుసరించవలసిందిగా కాంగ్రెసు ముఖ్యమంత్రులకు సలహా ఇవ్వాలనీ సూచించారు.

శ్రీ డి. కె. పటేల్ (జనసంఘం) ఆదివాసులకు సమకూర్చబడుతున్న విద్య వారికి ఎంతగా ఉపయోగపడటంలేదన్నారు. విద్యావిధానంలో సమూలమైన మార్పులు చేయాలనీ, వెనుకబడిన తరగతుల విద్యార్థులకు సకాలంలో విద్యార్థి వేతనాలు లభించజేయాలనీ సూచించారు. ఆదివాసులను అటవీశాఖ అధికారులు వేధిస్తున్నారని ఆయన ఫిర్యాదు చేశారు.

శ్రీ దేసాయిపుకుమార్ (?) (కాంగ్రెసు) ప్రసంగిస్తూ, దేశ సమైక్యత, ప్రగతి, షెడ్యూల్డ్ కులాల, తెగల ప్రజల సంక్షేమంపై ఆధారపడి ఉన్నదన్నారు. ఈ తరగతులకు చెందిన ప్రజలు ఇప్పటికీ సాంఘికంగాను, ఆర్థికంగాను వెనుకబడేఉన్నారని, ఏళ్ళ తరబడి కమీషనర్ నివేదికలను పార్లమెంటుకు సమర్పిస్తూనేఉన్నా వాటి అమలుకు సంబంధించిన నివేదికలను ప్రభుత్వం సభనారిముందు ఉంచడంలేదని విమర్శించారు.

శ్రీ బిరేన్‌ఘోష్ (సి. పి. ఐ. ఎం.) మాట్లాడుతూ, వెనుకబడిన తరగతుల ప్రజలను సముద్ధరించినట్లు ప్రభుత్వం గొప్పలు చెప్పుకుంటున్నప్పటికీ సవర్ణులు ఇప్పటికీ హరిజనులను హింసిస్తూనే ఉన్నారన్నారు. నేరస్థులను మంత్రులు, అధికారులు కాపాడుతున్నారని ఆయన ఆరోపించారు.

## రాష్ట్రపతి ఉద్బోధ

(1వ పేజీ తరువాయి)

భావాన్ని మళ్ళీ పుంజుకోవాలి. ప్రతి గ్రామీణుడు సౌభాగ్యప్రదమైన జీవనం సాగించగలిగేందుకు వీలుగా మన ఆర్థికాభివృద్ధి ఫలితాలు గ్రామ సీమలకు అందేట్లు చూడాలి. దీనికి దేశంలోని స్త్రీ, పురుషులందరి మద్దతు సహకారం అవసరం. ఇది మనకొక సవాలుతో కూడిన లక్ష్యం. ఈ సవాలును సాహసంతో ఆత్మ విశ్వాసంతో ఎదుర్కొందాం.

"నాకు హృదయ పూర్వకంగా మీరు ఇచ్చిన స్వాగతానికి నా కృతజ్ఞతలు. ఆంధ్ర ప్రజలంతా మరింత సుఖ సౌభాగ్యాలతో వర్ధిల్లాలని నేను ఆకాంక్షిస్తున్నాను!"

## ముఖ్యమంత్రి ప్రసంగం

ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు తమ ప్రసంగంలో వచ్చే నాలుగేండ్లలో గోదావరి బారాజ్ నిర్మాణం కూడా పూర్తి చేయడానికి ప్రభుత్వం దృఢ సంకల్పంతో ఉన్నదని వక్కాణించారు.

అధికోత్పత్తి సాధనకు నాగార్జునసాగర్, పోచంపాడు, వంశధార ప్రాజెక్టులను త్వరితంగా పూర్తి చేయడానికి కేంద్రం తగు సహాయం చేయాలని అభ్యర్థించారు. కొత్తగూడెం, శీలేరు, శ్రీశైలం, విద్యుత్ ప్రాజెక్టులను నిర్మించటానికి కేంద్రం ఎక్కువ సహాయం చేసేట్లు వత్తిడి చేయగలమని ప్రకటించారు. గోదావరి రైలురోడ్డు వంతెన నిర్మాణంలో అద్భుత ప్రతిభను ప్రదర్శించిన ఇంజనీర్లను, సాంకేతిక నిపుణులను, కార్మికులను ముఖ్యమంత్రి అభినందించారు.

రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ ఆలీఅహ్మద్‌కు ఆంధ్రప్రదేశ్ ప్రజలపట్ల అభిమానానికి ముఖ్యమంత్రి కృతజ్ఞత తెలిపారు.

గోదావరి డెల్టాలో ఈ ఏడాది దాళ్వా సాగుకు 1 లక్ష 87 వేల ఎకరాలకు అదనంగా మంజూరు చేయబడినట్లు ఆయన తెలిపారు.

రైల్వే మంత్రి శ్రీ ఎల్. ఎన్. మిశ్రా తన ప్రసంగంలో బీబీనగర్—నడికూడి రైలు మార్గం నిర్మాణాన్ని సకాలంలో పూర్తి చేయగలమని, ప్రజలు ఈ విషయంలో అపోహ చెందనవసరం లేదని హామీ ఇచ్చారు.

ఆంధ్రప్రదేశ్ చరిత్రలో ఈ వంతెన ప్రారంభోత్సవం స్వర్ణ యుగమని అభినందించారు.

రాష్ట్రపతి శ్రీ అహ్మద్ ఈ కార్యక్రమం అనంతరం తిరిగి ప్రత్యేక విమానంలో హైదరాబాద్ వెళ్ళారు.

## వారఫలం

21-11-1974 గురువారం
శక సం. 1896 కార్తీకమాసం 30

★ మేషం : వృత్తిలో ప్రయోజనంగల సంభాషణలు జరుపగలరు. పుణ్యకార్యాలు చేస్తారు.
★ వృషభం : రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి.
★ మిథునం : మీ రాతలను మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు.
★ కర్కాటకం : మీ ఆలోచనలు ప్రయోజనకరంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి.
★ సింహం : అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు.
★ కన్య : వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి.
★ తుల : మీ కార్యక్రమాలు ఆడావుడిగా వుంటాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి.
★ వృశ్చికం : ప్రయాణాలు ఫలిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.
★ ధనుస్సు : వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ప్రయాణంద్వారా కార్యసాధన చేస్తారు.
★ మకరం : మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.
★ కుంభం : లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. వృత్తిలో శ్రమ కలుగుతుంది.
★ మీనం : ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

— మహేష్



చిత్ర విచిత్రం ✳ శ్రీకాంత్

## 'చటర్జీ పథకం'

[illegible] సుర్జీ. సినీ రంగంలో [illegible] జేబుదొంగ కథకుడు. 'బెస్ట్ పప్పు' [illegible] ... చిత్రాలను నిర్మించడంలో [illegible] ''జేబుదొంగ'' చిత్రం నిరూపిస్తుంది.

హీరో శోభన్‌బాబు అంటే చాలాయిష్టం. ఆయనతో మాత్రమే చిత్రాలను తీయాలన్న తలంపువున్న మనిషి. మంచి భావాలు వున్న వ్యక్తి. మంచితనం వున్న వృత్తమునుడు.

తనేమో, తన వనేమో అనుకునినిర్మిస్తున్న చిత్రం. హిట్ గావడానికి రావలసిన అన్ని సమకూర్చుకొంటున్నారు.

ఎవరూ వెళ్ళని ప్రదేశానికి అవుట్‌డోర్ వెళ్లాలనుకొంటున్నారు. ఎవరి చిత్రంలో లేని ఫైట్లను పెట్టదలిచారు. అందరికి నచ్చే అంశాలను తన చిత్రంలో జొప్పించారు. విక్టరీ మధుసూధనరావు, వెంకటరత్నం, చక్రవర్తి, శోభన్‌బాబులాంటి వృద్ధులుండు లుంటే చటర్జీ ప్లానుకు తిరుగెక్కడిది?

## మహారాష్ట్ర మునిసిపల్ ఎన్నికలు

### కాంగ్రెసు వెనుకంజ

బొంబాయి, నవంబరు 20 : మహారాష్ట్రలో జరిగిన పురపాలక ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ ఇంతవరకు 16 పట్టణాలలో మాత్రం అధికారంలోనికి వచ్చింది. రాష్ట్రంలోని 193 పురపాలక సంఘాలకు ఇంతవరకు 142 సంఘాల ఫలితాలు ప్రకటించబడ్డాయి.

ఎన్నికైన వారిలో అత్యధికులు ఇండిపెండెంట్లు. వీరు 106 పురపాలకసంఘాల అధ్యక్ష పదవులను హస్తగతం చేసుకున్నారు.

ఈ ఎన్నికలు కొత్త చట్టం ప్రకారం జరిగాయి. అధ్యక్షులను, కవున్సిలర్లను వోటర్లే ఎన్నుకున్నారు.

—:o:—

## విజయవాడలో పిల్లలకు ఉచితంగా పాలు సరఫరా

విజయవాడ, నవంబరు 20 : ఈ పట్టణ పురపాలక సంఘం తన మాతాశిశుసంరక్షణ కేంద్రాలు, పాఠశాలల ద్వారా ప్రత్యేక పోషకాహార కార్యక్రమం క్రింద పిల్లలకు ఉచితంగా రొట్టెను సరఫరాచేస్తోంది. పట్టణంలోని 40 కేంద్రాలలో 10 వేల మంది పిల్లలకు రొట్టె ఇస్తున్నారు. ఈ పిల్లలకు దశలవారీ పథకంలో ఉచితంగా పాలను సరఫరా చేయాలని పట్టణంలోని పాలపొడిఫ్యాక్టరీ యాజమానులు నిశ్చయించారు. ఈ ఫ్యాక్టరీకి సమితి శిశు సంక్షేమనిధి వారు ఇస్తున్న సహాయం క్రింద పిల్లలకు పాలు ఇస్తారు.

ఇప్పటి నుంచి, విద్యాధరపురం, చిట్టినగర్, విజయపేట, లబ్బీపేట, సత్యనారాయణపురం, కృష్ణలంక సీతారామపురం, శ్రీనివాసమహల్ ఎదురుగల పురపాలక మాతాశిశుసంక్షేమ కేంద్రాలలో పాలు ఇచ్చే ఏర్పాటు చేశారు.

## మా ఊరి సమస్య

### ముడుదాం మట్టిరోడ్డు

(10రూ.లుబహుమతిపొందినలేఖ)

మా వూరికి పంచాయతివారు మట్టిరోడ్డు వేయించారు. అది పూర్తిగా పాడయి గుంటలుపడి, నీరు నిలిచి రాకపోకలు ఒక సమస్యగా తయారయ్యాయి.

కోరాడ అప్పారావు, బి. కామ్. తరగతి, ముడుదాం, వంటితాటిపల్లి, విజయనగరం తాలూకా, విశాఖజిల్లా.

### తాతావారిపాలెం రేడియో

తాతావారి పాలెంలో రేడియోమోగదు. పంచాయితీ వారు, ఇంజనీరు తగు చర్య తీసుకోవాలి.

పాకా రామకృష్ణరావు(జి.ఇ.డబుల్యూ) తాతావారి పాలెం, నూరేపల్లి పోస్టు, రేపల్లె తాలూకా, గుంటూరుజిల్లా.

### వంగనూరు దీపాలు

వంగనూరుకి కరెంటు వచ్చి ఏనిమిది సంవత్సరాలయింది. వీధి దీపాల స్తంభాలకి కరెంటు దీపాలు లేవు.

ఎ. సి. పుల్లారెడ్డి అజ్జగుట్ట వెంకటురెడ్డి కుమారుడు, వంగనూరు గ్రామం, కడపత్రి తాలూకా అ. జి.

# హరిజన, వెనుకబడిన వర్గాల ఆర్థికాభివృద్ధి: నందిగామ సభలో జిల్లా కలెక్టరు హామీ

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

నందిగామ, నవంబరు 20 : నిన్న ఇక్కడ నందిగామ, జగ్గయ్యపేట తాలూకాల అల్పసంఖ్యాక, బలహీన వర్గాల విమోచన దినోత్సవం ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి 57వ జన్మదినోత్సవం సందర్భంగా, కృష్ణా జిల్లా కలెక్టరు శ్రీ కె. ఆర్. వేణుగోపాల్ ముఖ్య అతిథులుగా పాల్గొంటూ, ఈ ప్రాంతంలో మిగులు భూమిని తప్పక యిక్కడి హరిజన, బలహీన వర్గాల వారికి మాత్రమే పంచి ఇవ్వగలమనీ, నందిగామలో, నాలుగయిదు రోజులు మకాంచేసి ఇచ్చట ప్రజల కష్టాలనీ, ఇబ్బందులనీ, గమనించగలమనీ, పంటలు పండని సందర్భాలలో రైతులకు శిస్తు రెమిషన్‌ఇప్పించగలమనీ హరిజనులు, చౌక డిపోలు నడుపకొనేందుకు వారికి తప్పక ఋణాలు ఇప్పించగలమనీ హామీ ఇచ్చారు.

సభకు నందిగామ పంచాయితీ సమితి అధ్యక్షులు శ్రీ ముక్కపాటి వెంకటేశ్వరరావు అధ్యక్షత వహించారు.

ఈ సందర్భంలో పంచాయితీ సమితినిధులలో 5 శాతం నిధుల ద్వారాను సెంట్రలు బ్యాంకి ఇచ్చిన ఆర్థిక సహాయం ద్వారా సమకూరిన 14 కుట్టుమెషిన్‌లను (స్వ్యూయింగ్ మెషిన్స్) పేద స్త్రీలకు జిల్లా కలెక్టరు పంచిపెట్టారు. 18 మంది యాదవులకు 108 గొర్రెలను కూడా కలెక్టరు పంపిణీ చేశారు.

హరిజనులకు భూమిలేని పేదలకు పోరంబోకులను పంపిణీ చేయుటం జిల్లా గెజెట్‌లో వాటి విషయం ప్రకటించినమీదటవాటినిపంపిణీ చేయుటం సాధ్యం అవుతుందని కలెక్టరు పేర్కొన్నారు.

కృష్ణా జిల్లాలో ప్రభుత్వం 11 లక్షల రూపాయల సమకూర్చిందనీ, సుమారు 80 లక్షల రూపాయలు కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు వారు ఇవ్వగలమని హామీ ఇచ్చారనీ, ఆ విధంగా సమకూరే సుమారు 1 కోటి రూపాయలతో చౌకడిపోలు నడుపుటకు హరిజనులకు ఋణాలు ఇవ్వగలమనీ, శ్రీ వేణుగోపాల్ వివరించారు.

ఇండ్ల స్థలాల పంపిణీ విషయంలో 93 లక్షల రూపాయలు అవసరం కాగా, లభించిన నిధి 7న్నర లక్షలు మాత్రమే అని, కలెక్టరు ఉన్న పరిస్థితిని తెలియ జేశారు.

ఈ ప్రాంతంలోపంచదార కార్ఖానుకొత్తని తయారై సిద్ధంగా ఉన్నదనీ ఈ నెలాఖరులోగా పంపిణీ చేయగలమనీ, వాటిపై కిరసనాయిలు కూడా యిప్పించగలమనీ, బియ్యం మాట ప్రస్తుతంచెప్పలేమనీ ఆయన తెలియ జేశారు.

సభకు,పలుగ్రామాలనుంచి హరిజన,హరిజన క్రైస్తవ, ముస్లిం, ఎరుకల, ఏనాది, లంబాడీ, వడియరాజు, మొండిబండ, పాముల, మేదలపల్లె కారీ, రజక, యాదవ, గౌడ తదితర పలు వెనుకబడిన వర్గాల ప్రజలు 2 వేల మంది హాజరైనారు.

అంతకి ముందు సభాధ్యక్షులు శ్రీముక్కపాటి వెంకటేశ్వరరావు ప్రసంగిస్తూ, కృష్ణా కలెక్టరు రోజుకు నిర్విరామంగా 18 గంటలు కృషి చేస్తూ, ఎవరువచ్చినా వారి కష్టసుఖాలు విని పేద వర్గాలపాలిట పెన్నిధిగా ఉన్నారని ప్రశంసించారు.

సభ జయప్రదం కావటానికి చిల్లకల్లు సమితి అధ్యక్షులు శ్రీ తొండపు రాధాకృష్ణమూర్తి శ్రీ రేపాల బుచ్చిరామశేషయ్యశ్రేష్ఠి (జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు), శ్రీ కోనేరు రంగారావు, శ్రీ గాలేటి వెంకటేశ్వర్లు, ఎం. ఎల్. సి., శ్రీ చదల జానకిరామారావు, శ్రీ నేముల వెంకటకేశవరావు ప్రభృతులు ఉత్సాహంగా తోడ్పడ్డారు.

శ్రీ వేముల వెంకటకేశవరావు సభా కార్యక్రమంనిర్వహించారు. మాట్లాడినప్రముఖులలో శ్రీయుతులు బుచ్చిరామశేషయ్యశ్రేష్ఠి, చదల జానకిరామారావు, గుగ్గిళ్ళ వెంకయ్య, యుడపల్లి జ్వాలా నరసింహం, చింతల ముత్యాలు, షేక్ ఎలీషా, శ్రీ గాలేటి వెంకటేశ్వర్లు, శ్రీ కోనేరు రంగారావు, శ్రీ నూటుకూరు నరసింహారావు శ్రీ పన్నా సత్యనారాయణ ప్రభృతులు ఉన్నారు.

అనేక పేద వర్గాలవారు సమర్పించిన విజ్ఞప్తి పత్రాలను సావధానంగా పరిశీలించగలమని కూడా కలెక్టరు హామీ ఇచ్చారు.

నందిగామ తాలూకాలో వెనుకబడిన జాతులు, హరిజనులు సాగుచేసుకొనే బంజరు భూములకు వెంటనే పట్టాలు ఇప్పించాలని కలెక్టరును కోరుతూ, ప్రారంభంలో సభవారు ఏకగ్రీవంగా తీర్మానం చేశారు.

హరిజన, ఇతర పేద వర్గాలకు ఇండ్ల స్థలముల సమస్య కూడా పరిష్కరించాలని మరొక తీర్మానం చేశారు.

నందిగామ తాలూకాలో అన్ని డిపోలకు బియ్యం సప్లయి కొనసాగించాలని కూడా కోరుతూ మరొక తీర్మానం ఆమోదించారు.

శ్రీ ముక్కపాటి వెంకటేశ్వరరావు తన ప్రసంగంలో నందిగామ తాలూకాను కరువు ప్రాంతంగా ప్రకటించాలని కలెక్టరును అభ్యర్థించారు.

—o:o—

## వెండి, బంగారం ధరలు

నవంబరు 20 :

| | | |
|---|---|---|
| బొంబాయి మార్కెట్ | | |
| వెండి రెడీ | రు. | 1110—00 |
| బంగారం | రు. | 533—00 |
| కలకత్తా మార్కెట్ | | |
| వెండి రెడీ | రు. | 1075—00 |
| హైదరాబాదు మార్కెట్ | | |
| వెండి 1 కిలో | రు. | 1065—00 |
| ,, 10 గ్రా. | రు. | 11—25 |

## రైతుకి న్యాయం

ఆర్యా! నాయకుల పిలుపునుసరించి నావంటి గ్రాడ్యుయేట్లు అనేకమంది వ్యవసాయం ప్రధాన జీవనోపాధిగా జేసుకొని జీవించు చున్నాము.

రు. 52 ఖరీదుయుండేయూరియా బస్తా ప్రభుత్వం రు. 105 లకు పెంచినది. రు. 65 ఖరీదు యుండే 28:28 అమోఫాస్ఫేట్ బస్తా రూ. 150. వీటికి బజారులో యూరియా ధర రు. 205, కోరమాండలు వారి 28:28 బస్తా ధర రు220, వీటితోపాటుసస్యరక్షణమందులు ధరలుగూడ విపరీతముగ పెరిగినవి.

పైగా వీటన్నింటికితోడు పంటచేతికి వచ్చే వరకు నమ్మకం లేదు. ప్రకృతిదయాదాక్షిణ్యముల మీద ఆధారపడియున్నది రైతు ఆర్థిక పరిస్థితి. ఇన్ని ఇబ్బందులలోనయు రైతు జాతికి కావలసిన ఆహారం అందించుచున్నాడు. అటువంటి రైతుకు న్యాయం జరుగడం లేదు. ధాన్యంధర క్వింటాలుకు రు. 125 —గా నిర్ణయించి ప్రభుత్వం రైతును ఆదుకొనగలందులకు కోరుచున్నాను.

నిరోద్‌లు లగాయితు నిత్యావసరవస్తువుల ధర పెంచగూడని ఇన్‌ఫ్లేషను ధాన్యం ధర పెంచితే వస్తుందని రిజర్వు బ్యాంకు వాదించడం విచిత్రంగా యున్నది.

56 కోట్ల ప్రజలకు ఆహారంఅందించే రైతు ఈనాడు దీనాతిదీనుడు. రాష్ట్ర ప్రభుత్వం కేంద్రప్రభుత్వం పై వత్తిడి తెచ్చి వ్యవసాయ రాష్ట్రమైన మన రైతులకు న్యాయమైన ధర యిప్పించగలందులకు ఆశిస్తున్నాను.

కరేటి సముద్రాలయాదవ్, (బి. ఏ.),

## లేఖలు

కన్వీనరు,లోకుమూడి గ్రామరైతు సంఘం, మండవల్లి పంచాయితీ సమితి, కైకలూరు తాలూకా, కృ. జి.

### చలనచిత్ర పరిశ్రమాభివృద్ధి

ఆర్యా! జనవరి 14 సంక్రాంతి రోజున ఆంధ్రప్రదేశ్ చలనచిత్ర పరిశ్రమ అభివృద్ధి కార్పొరేషన్ ఏర్పాటు అవుతుందని ఆర్థిక సమాచార మంత్రి శ్రీ పి. రంగారెడ్డి ఇటీవల తెలియ చేశారు. ఇది అప్రయత్నకరమైన వార్త. నాగార్జునసాగర్, శ్రీశైలం ఇత్యాది ప్రాజెక్టులను పూర్తి చేసుకొనడానికి మనకు ఆర్థిక వనరులు లేవు. యు. జి. సి. కొత్త స్కేళ్ళను అమలు పరచే తాహతు లేదు. ఆహార ధాన్యాలు తదితర నిత్యావసరవస్తువులను సబ్సిడీ యిచ్చి అయినా పేదప్రజలకు చౌకగా అందచేసే ఆలోచన లేదు. నిరుద్యోగాన్ని, పేదరికాన్నిబాపే— తమిళనాడు ప్రభుత్వం వలె పూనుకునే స్కీములు లేవు. కాని వలన చిత్రాలపై, ఆ వరి శ్రమపై మన రాష్ట్ర ప్రభుత్వం వ్యామోహం, మోజు వహించి అభివృద్ధి కార్పొరేషన్ ఏర్పాటు చేయబూనటం గుర్రానికి ముందు బండి కట్టటమే అవుతుంది.

చలనచిత్రాలు నిత్యావసర వస్తువుల వంటివికావు. కేవలంవిలాసం, వినోదంకోసం డబ్బు ఎక్కువగా వున్నవాళ్ళు వ్యయపరచి చూచేవి. ప్రజాజీవనంలో వీటి ప్రాధాన్యం తక్కువ. ప్రాముఖ్యం అల్పం. పేద ప్రజల జీవన పరిస్థితులను మెరుగుపరచి వారి జీవన ప్రమాణ స్థాయిని పెంచే యత్నంలో వీటిపాలు ఏమీ లేదు. కనుక ప్రభుత్వం చలన చిత్ర పరిశ్రమాభివృద్ధి కార్పొరేషన్‌ను నెలకొల్పే వనరులను సాంఘిక సంక్షేమాభివృద్ధి పథకాలకు మళ్ళించటం భావ్యం.

చలనచిత్ర పరిశ్రమ అభివృద్ధి చెందవచ్చుకాని ప్రభుత్వ ప్రమేయంకాని, ప్రజలు పన్నులు రూపేణా ఇచ్చేడబ్బును దీనికోసం వ్యయ పరచడం కాని తగదు. ప్రయివేటు రంగంలో ఈ పరిశ్రమను వర్ధిల్లింపచేసే ప్రభుత్వం థియేటర్లు కట్టటానికి లైసెన్సులు త్వరగా మంజూరు చేసి తగిన ప్రోత్సాహం యివ్వటంమంచిది. అంతేగాని అభివృద్ధి కార్పొరేషన్ అంటూ ఏవార్డులు, సబ్సిడీలు అంటూ ప్రజల డబ్బును దుర్వినియోగపరచటం అవాంఛనీయం.

ఇంక సూర్యనారాయణశర్మ, రాజాపేట, బందరు.

### పరీక్షా ఫలితాలు

ఆర్యా! 7—10—1974 నాడు జరిగిన ఇంగ్లీషు టయిపురయిటింగ్ ప్రాక్టికల్ పరీక్షా ఫలితాలు ఏపూర్తిగా పరీక్షలు జరిగినా ఆ వ్యాళ్లలో మాత్రం తెలిపారు. తక్కిన చోట్లవారికి వార్తా పత్రికల ద్వారాగాని, నేరుగా గుర్తింపబడిన ఇన్‌స్టిట్యూట్లద్వారా గాని తెలుపలేదు. ఇంకా కొందరికి తమ ఫలితాలు తెలియవు. ఈ పరిస్థితి మారాలి.

ఈదరపల్లి అప్పల నరసింహరాజు, కేరాఫ్ ప్రిన్సిపాల్, శ్రీ శ్రీనివాసాకమర్షియల్ ఇన్‌స్టిట్యూట్, గజపతి నగరం, విశాఖజిల్లా.

### అప్పుడు - ఇప్పుడు

అర్య, ఆరు నెలల నుంచి అర్జెంటులో లోనే వరిపాలన సాగిస్తున్న బీహారు శాసనసభ ఇంకా అమలులో ఉండుటారా?

1959లో శ్రీమతి గాంధి ప్రస్తుతమయిన కేరళ శాసనసభను రద్దు చేయింటానికి కాంగ్రెసు అధ్యక్షురాలిగా ఎంత కృషి చేసి సాధించలేదు?

శాసనసభలో మెజారిటే ఉన్నా ప్రజల ఒత్తిడిని మన్నించి అవినీతికరమైన ప్రభుత్వాన్ని తొలగించడం జరిగింది.

ఇప్పుడు ప్రజల హోదాలకు హక్కు భంగమవలేదా?

అకొండి రజారావు, పిఠాపురం, తూ. గో. జిల్లా.

### ఇంగ్లీషు పుస్తకం

అర్యా, ఇంటర్మీడియేట్ ఇంగ్లీషు పుస్తకం వెలువడింది. దాని అట్టమీద "ప్రెస్, పాయ్రట్రీ"లు ఉన్నట్లు రాసి ఉన్నప్పటికీ గద్యంగ్రంథం మాత్రమే ఉంది.

కె.ఎస్.ఎస్. ప్రసాదరెడ్డి, ప్ర. జూ. కళాశాల, (2వ ఇంటర్), ఓడెంసుంజ్ల, కర్నూలుజిల్లా.

## బాలకాండం

### యామిజాల పద్మనాభస్వామి

### 6 వ సర్గ

తస్మిన్ పురవరే హృష్టా
ధర్మాత్మానో బహుశ్రుతాః
నరాస్తుష్టా ధనైస్స్వైః స్వైః
రలుబ్ధా సత్యవాదినః 6
(పౌర వర్ణనం)

అయోధ్యలో ఉన్న జనులు ధర్మశాస్త్ర విషయాలు, నీతి నియమాలూ విద్యాంసుల వలన నిత్యమూ వింటూ వాటిని అనుసరించి ప్రవర్తించే బుద్ధి మంతులు. తమకు ఉన్న సంపదతో సుఖంగా తుష్టిగా తృప్తిగా కాలం వెళ్ళిస్తూ ఉంటారు. పరుల సొత్తుకి ఆశపడరు. ఏ అవస్థలోనూ సత్యభాషణతేగాని అసత్యమంటే ఏమిటో తెలియనివారు. గృహస్థ జీవితంలో ఏలాంటి కష్టమూ ఎరుగని నిత్య సంతుష్టులు.

నాల్పసన్నిచయః కశ్చిత్
అసిద్ధార్థో పురోత్తమే
కుటుంబియో హ్యసిద్ధార్థః
అగవాశ్వ ధన ధాన్యవాన్ 7

అల్ప ధనవంతుడు, ధర్మార్థకామాలను సక్రమంగా, సమృద్ధిగా పొందనివాడు, ఆవులు, మంచి గుర్రాలు, ధనధాన్యాలూ లేనివాడున్నూ అయిన కుటుంబి (భార్య పుత్ర పుత్రికా సంతతి కలవాడు.) ఒక్కడూ అయోధ్యలో లేడు.

కామీ వా న కదర్యో వా
నృశంసః పురుషః క్వచిత్
ద్రష్టుం శక్య మయోధ్యాయాం
నా విద్వాన్ న చ నాస్తికః 8

అయోధ్యలో కాముడూయు, లోభ (క్రూరుడు, విద్యాహీనుడు, నాస్తికుడు ఎక్కడ ఎక్కడ వెతికినా కనిపించరు:—
(తనను, భార్యను, పిల్లలను, తల్లిదండ్రులకు, సోదరులకు కూడా గుప్పెలు తృప్తిగా ఇవ్వక బాధించే పిసినారికి, కదర్యుడు' అని పేరు. ధనం అయిపోతుందని తాను తినడు, తన వారికి పెట్టడు— అట్టి లోభి—
పరులను హింసించేవాడు నృశంసుడు. (క్రూరస్వభావం కలవాడని భావం.)

|సశేషం|

# ఆంధ్రలో పొగాకు నిల్వల విడుదలపై సానుభూతితో పరిశీలన: సుబ్రహ్మణ్యం హామీ

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

న్యూఢిల్లీ, నవంబరు 20 : ఆంధ్రప్రదేశ్‌లో ఈ ఏడాది రు. 10 కోట్ల విలువ మేరకు నిలువ వుండిపోయిన వర్జీనియాపొగాకు నిలువలకు వెంటనే సహాయ చర్యలు తీసుకునే విషయాన్ని సానుభూతితో పరిశీలించగలమని కేంద్రఆర్థికమంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యం ఒక ప్రతినిధివర్గానికి హామీ యిచ్చారు.

గుంటూరులోని భారతీ పొగాకు ఉత్పత్తిదారుల సంఘం తరఫున, మద్రాసులోని పొగాకు ఎగుమతి అభివృద్ధి మండలి తరఫున రాజ్యసభ సభ్యుడు శ్రీ బెజవాడ పాపిరెడ్డి నాయకత్వాన ఒక ప్రతినిధివర్గం శ్రీ సుబ్రహ్మణ్యంను కలిసికొంది. ఈ ప్రతినిధివర్గంలో మాజీమంత్రి శ్రీ రొండానారాయణరెడ్డి, శ్రీ చేబ్రోలు హనుమయ్య, శ్రీ బి. వి. నరసయ్య (గుంటూరు సంఘ అధ్యక్షులు) ఆర్థిక మంత్రికి ఒక విజ్ఞాపనపత్రాన్ని సమర్పిస్తూ వర్తకుల వద్దఉన్న పొగాకు నిల్వలను విడుదల చేయించకపోతే గుంటూరులోని పొగాకు వ్యాపారులు వచ్చే పంటకాలం—జనవరి నుంచి ఏప్రిల్ వరకు— పొగాకును కొనుగోలు చేయలేరనీ, ఇందువల్ల వచ్చే ఏడాది పొగాకుపంట బాగా దెబ్బతినగలదనీ వివరించారు. ఆంధ్రప్రదేశ్‌లో నిల్వంగా ఉన్నపొగాకును కొనవలసినదిగా దేశంలోని సిగరెట్ ఫ్యాక్టరీల యజమానులకు సలహా ఇవ్వవలసిందని మంత్రిని కోరారు. బంగ్లాదేశ్‌లోని దిగుమతి దారులతో కుదుర్చుకున్న ఒప్పందాల ప్రకారం రు. 60 లక్షలు విలువగల పొగాకు ఎగుమతికాగలదనీ, అందువల్ల ప్రస్తుతంవున్న పొగాకు కాంట్రాక్టులను నమోదు చేసుకోవలసిందని కలకత్తాలోని స్టేట్‌బ్యాంకు తక్షణమే ఆదేశాలు యివ్వవలసినదిగా కూడా కోరారు. రష్యా, ఇతర మిత్రదేశాలు 1974 లో ఉన్నత, మధ్యతరహాలకాల కొనుగోలును బాగా తగ్గించాయనీ, అందువల్ల ఈ దేశాలను పొగాకును కొంత కొనవలసినదిగా కోరాలని సూచించారు. విదేశాలతో జరిగే వాణిజ్య ఒప్పందాలలో పొగాకును కూడా చేర్చాలన్నారు. అవాంతర నిల్వల పథకాన్ని పొగాకుకు వర్తింపచేయాలనీ, పొగాకు బోర్డును వెంటనే ఏర్పాటు చేయాలనీ కూడా ఈ ప్రతినిధి వర్గం కోరింది.

# జయప్రకాష్‌కు మార్క్సిస్టుపార్టీ పాక్షిక మద్దతు : నంబూద్రిపాద్ వివరణ

బొంబాయి, నవంబరు 20 : దేశంలో ఏర్పడుతున్న కాంగ్రెస్ వ్యతిరేక పరిస్థితిని వినియోగించుకొనడంలో ఒక విధమైన అవగాహనకు వచ్చే విషయమై చర్చించడానికి శ్రీ జయప్రకాష్‌నారాయణ్‌ను తాము కలిసికొనదలిచినట్లు మార్క్సిస్టుపార్టీ నాయకుడు శ్రీ ఇ. ఎం. ఎస్. నంబూద్రిపాద్ నిన్నయిక్కడ బొంబాయి పత్రికా రచయితల సంఘం ఏర్పాటు చేసిన పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో మాట్లాడుతూ చెప్పారు. అయితే ఎలాంటి అవగాహన అనే విషయమై అడిగిన ప్రశ్నలకు ఆయన జవాబు చెప్పలేదు. ఈ సందర్భంగా ఆయన శ్రీ జయప్రకాష్ వైఖరిలో మార్పును ప్రస్తావించి, పార్టీరహిత ప్రభుత్వం ఏర్పడాలని మొదట వాదించిన శ్రీ జయప్రకాష్ ఇప్పుడు సర్వపక్ష ప్రభుత్వం ఏర్పాటుకు అంగీకరించారనీ, ఆయన అలా మారతారని నెల రోజులు క్రితం ఎవరూ అనుకోలేదనీ, ఈ మార్పును తమ పార్టీ హర్షిస్తున్నదనీ చెప్పారు.

బీహారులో శ్రీ జయప్రకాష్ నిర్వహిస్తున్న ఉద్యమంలో తమ పార్టీ భాగస్వామే కాని, శ్రీ జయప్రకాష్ జనతా సంఘర్షణ సమితిని ఏర్పాటుచేయడాన్ని తమ పార్టీ వ్యతిరేకిస్తున్నదని శ్రీ నంబూద్రిపాద్ స్పష్టం చేశారు.

కాంగ్రెసును ఎదుర్కొనేందుకు కాంగ్రెసు వ్యతిరేక పార్టీలను కలపాలని శ్రీ జయప్రకాష్ ప్రయత్నిస్తున్నారనీ, ఆయన ఉద్యమంలో ఆయన పట్ల మార్క్సిస్టుపార్టీకి సానుభూతి, సమైక్యత ఉన్నప్పటికీ ఆయన ఉద్యమం వెనుక జనసంఘం, సంస్థాకాంగ్రెస్, భారతీయ క్రాంతిదళ్ వంటి కొన్ని రాజకీయ పక్షాలు ఉన్నందున, ఆ ఉద్యమానికి తమ పార్టీ పూర్తి మద్దతు ఇవ్వలేకపోతున్నదని శ్రీ నంబూద్రిపాద్ చెప్పారు.

మరో ప్రశ్నకు ఆయన జవాబిస్తూ, శ్రీ జయప్రకాష్‌తో తాము ఎంతవరకు, ఏ విధంగా సహకరించగలమో తెలిసికొనదలిచామనీ, అందుకే ఆయనను కలుసుకోవాలని భావిస్తున్నామనీ చెప్పారు.

## 21 న కామరాజ్ చర్చ

న్యూఢిల్లీ: సంస్థా కాంగ్రెస్ నాయకుడు శ్రీ కామరాజ్ ఈ నెల 21న శ్రీ జయప్రకాష్‌ను ఇక్కడ కలుసుకుని, బీహారులో పరిస్థితిని గురించి, ఆయన ఉద్యమం విస్తరణను గురించి చర్చించగలరని తెలుస్తోంది.

పాట్నా నుంచి అందిన సమాచారం ప్రకారం, దేశంలోని వివిధ ప్రాంతాలకు చెందిన విద్యార్థి, యువజన నాయకుల సమావేశాన్ని ఈ నెల 23, 24 తేదీలలో ఢిల్లీలో శ్రీ జయప్రకాష్ ఏర్పాటు చేశారు. మితవాద కమ్యూనిస్టుపార్టీని మినహాయించి, ప్రతిపక్ష నాయకుల సమావేశాన్ని 25, 26 తేదీలలో ఏర్పాటుచేశారు.




ఆంధ్రా—హైద్రాబాద్ రంజీ ట్రోఫీ క్రికెట్ మాచ్ విజయవాడలో జరుగబోవుసందర్భంలో నేటి రాత్రి రెండవ ఆట విజయవాడ .... శ్రీ వెంకటేశ్వర (ఏసి) లో 'రోటీ కపడా ఔర్ మకాన్' ప్రత్యేక ప్రదర్శన మా మూలు రేట్లకే ప్రదర్శింపబడుతుంది. వివరాలు థియేటరు వద్ద తెలుసుకొనండి.




# డి.సి.సి.లో ఒకే వర్గానికి ప్రాతినిధ్యం: శ్రీ అల్లూరి బాపినీడు విమర్శ

ఏలూరు, నవంబరు 20 : పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెసు కమిటీ అల్లూరి రహదారి బంగళాలో జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ చిడవోలు మృత్యుంజయరావు అధ్యక్షతన సమావేశమైంది. సభకు రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ పిరమాచనేని వెంకట నారాయణ, రాష్ట్ర పంచాయితీ రాజ్య మంత్రి శ్రీ ఉండవల్లి లక్ష్మణదాసు పరిశీలకులుగా హాజరయినారు. శ్రీ పిరమాచనేని వెంకట నారాయణ తమ ప్రసంగంలో ప్రజాస్వామ్య విధానాన్ని శ్రీ జయప్రకాష్‌నారాయణ నాశనం చేస్తున్నారని ఎన్నికైన ప్రభుత్వాలను రద్దు చేయమనడం, ఆందోళనల ద్వారా పడగొట్టడం న్యాయంకాదని దీనివల్ల వచ్చే ముప్పును కాంగ్రెసు కార్యకర్తలందరూ ఎదుర్కోవాలని ఉద్బోధించారు. జిల్లా పరిషత్ అధ్యక్షుడు శ్రీ అల్లూరి బాపినీడు మాట్లాడుతూ కమిటీ సభ్యులను వేయడంలో ఒకే వర్గం వారిని వేసుకున్నారని, ఎ.ఐ.సి.సి. సభ్యులైన తననుగాని కొమ్మారెడ్డి సూర్యనారాయణనుగాని సంప్రదించలేదని ఎవరి వర్గాన్ని వారు బలపరచుకోవడం తప్ప మరొకటి కాదని, కొందరు పెద్దలు కాంగ్రెసునుంచి బయటకు పోవడం, మళ్లా రావడం అందరూ ఎరిగినదేనని, తీవ్రంగా విమర్శించారు. శ్రీయుతులు కొమ్మారెడ్డి సూర్యనారాయణ, పరకాలా శేషావతారం ప్రభృతులు ప్రసంగించారు.

## సన్మానం

జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ చిడవోలు మృత్యుంజయరావు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ పిరమాచనేని వెంకటనారాయణ గార్లను ఏలూరు పరిషత్ స్వాగతంలో శ్రీ కొత్తపల్లి రావు ఘనంగా సన్మానించారు. సభకు పంచాయితీరాజ్య మంత్రి శ్రీ ఉండవల్లి లక్ష్మణదాసు అధ్యక్షత వహించారు. సన్మానితులను శ్రీ సల్లపరాపు నూతన వస్త్రములతో సన్మాన పత్రములతో గౌరవించారు. శ్రీ వెంకటనారాయణ తమ సమాధానంలో అల్లూరి సమావేశాన్ని ప్రస్తావించి పెద్దలైన శ్రీ అల్లూరి బాపినీడు, కొమ్మారెడ్డిగార్లతో సంప్రదించకపోవడం పొరపాటేనని, దానికి విచారాన్ని ప్రకటిస్తున్నానని, ఋషి విశ్వామిత్రుడు లాంటివాడే మేనక వల్లనంతో చలించాడని, తాను కూడా మధ్యన కాంగ్రెసు నుండి బయటకు పోయినవాడు కాంగ్రెసువాడినేనని, పరిపరకూ కాంగ్రెసువాడినేనని చెప్పారు. శ్రీయుతులు అల్లూరి బాపినీడు, బంధ వి అంజనేయులు, టి.కె.ఆర్. శర్మ ప్రసంగించారు.

మంత్రి శ్రీ లక్ష్మణదాసు పటంకాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ సంకురాత్రి సుబ్బారావు ఆహ్వానంపై హరిజనవాడ సందర్శించి వారిచ్చిన వినతిపత్రాలు స్వీకరించి వారి కష్టసుఖాలు సాధ్యమైనంత త్వరలో చక్క బరుస్తామని హామీ యిచ్చారు.

ఏలూరు తూర్పు కాపుల విద్యా విజ్ఞాన సంఘంవారు మంత్రిని నూతన వస్త్రాలతో, పూలమాలలతో సన్మానించారు. (స్వ.వి.)

# చీరాల కళాశాలలో యం. కాం. తరగతులు

(స్వకీయ విలేఖరి)

చీరాల, నవంబరు 20 : చీరాల వి.ఆర్. ఎస్. అండ్ వై. ఆర్. ఎన్. కళాశాలలో రానున్న డిసెంబరు నుండి యం. కాం. తరగతులు ప్రారంభించనున్న సందర్భంగా ఆంధ్ర విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ శ్రీ పి. ఎ. శివయ్య కళాశాలలోగల వసతులను పరిశీలించి, సభ్యులతో సంప్రదింపులు జరిపారు.

నూతన విశాలమైన భవనములలో సౌకర్యాలు కలిగిన పెద్ద లైబ్రరీ, పుస్తకాలతో యం. కాం. ప్రారంభించుటకు అన్ని హంగులు సమకూడి వున్నాయి.

ఈ యం. కాం. ప్రారంభంతో యం. ఏ. (పొలిటిక్స్) కూడా ప్రారంభించబడనున్నది అని కాలేజి ప్రిన్సిపాల్ శ్రీ పి. ఆగస్వరరావు తెలియజేస్తున్నారు.












KENIOSHA
WISCONSCIN STATE
U.S.A

ప్రియమైన ప్రేక్షకులకు నమస్కారం.

ప్రస్తుతం నేను 'తెలుగునాడు'కు కొన్నివేలమైళ్లదూరంలో వున్నా, 'తెలుగువాడి'కీ నాకూ మధ్య రవ్వంత దూరమైనాలేదు అనేభావం నా చేత యీ వుత్తరం రాయిస్తూంది.

ఈ రోజుల్లో ప్రతి వ్యక్తికీ బరువులూ, బాధలూ అనేకం వుంటాయ్. రోజుకో క్షణమైనా అతణ్ణి ఆనందింపచేయాల్సిన బాధ్యత ప్రతి కళాకారుడిమీదా వుంది. ఆకృషిలో నాకూ భాగంవుందని మీరంతా అంగీకరించారు. ఎప్పటికీ యిప్పటిలాగే ఆదరిస్తారనే నమ్మకం నాకుంది.

ఈ మధ్య విడుదలైన పణిమాధవి వారి వినోదాత్మక చిత్రం 'దొరబాబు'ను మీరెంతగా ఆదరిస్తున్నారో పత్రికాముఖంగా తెలుసుకుంటూనే వున్నాను. ఈ సందర్భంలో అక్కడ లేనందుకు కొంత బాధగానే వుంది.

సహజంగా నా అభిమానులు, ఆంధ్రప్రేక్షకులు నేను నటించే పాత్రలకో ప్రత్యేకఫంథా వుంటుందని అనుకోటం పరిపాటే -

ఆనమ్మకాన్ని నిలుపుకోటంకోసం వైవిధ్యంవున్న 'దొరబాబు' పాత్రను పోషించాను. ఈ మార్పును మీరంతా ఎలా స్వీకరించారో, కళ్లారా చూడ్డానికి త్వరలో మీ ముందుకొస్తున్నాను. ఈ చిత్రం విజయంపట్ల నా ఆకాంక్షను అణచుకోలేక యీలేఖ రాశాను. నారాక కోసం ఎదురు చూసే నా వాళ్లందరికీ నాకృతజ్ఞతలు తెలుపుకుంటూ శలవు తీసుకుంటున్నాను.

ఇట్లు
మీ అక్కినేని



మీరు చవిచూసే ప్రతి హనీ బీ బ్రాందీ
గుటకలోనూ ఫ్రాన్సు యొక్క చిన్నభాగం ఉంది

హనీబీ బ్రాందీ చవిచూడండి ఒక్కసారి ఫ్రాన్సుకి వెళ్ళిన అనుభవాన్ని పొందండి



హనీ బీ
బ్రాందీ
ఆ ఫ్రెంచి అనుభూతి కోసం!



